శివ వేంకటీయ గ్రంథమాల.　　　　　　　　　　　　　　　　పంచమపుష్పం.

# పామఱ్ఱు (స్తూప) జయధ్వజ చరిత్ర.

ఇది

1913 సం॥ 12 డిశంబరు తేదీని జరిగిన ఢిల్లీ పట్టాభిషేక స్మరణచిహ్న

తృతీయవర్ష వర్ధంతిమహోత్సవసమయమందు

శ్రీమత్పంచమజార్జి చక్రవర్తివిజయడిండిమ

మై వెలువడునటుల

అడవి సాంబశివరావు

నందగిరి వేంకటప్పారావు

అను

శివ వేంకటకవులచే

విరచింపఁబడి

పామఱ్ఱు కారొనేషన్ కమిటీవారిచేఁ

బ్రచురింపఁబడియె.

---


బెజవాడ వాణీముద్రాక్షరశాలయందు

బి. కే. స్వామిచే

ముద్రింపఁబడినది.

మొదటికూర్పు 500 ప్రతులు.

1914.



　　　　　　　　　　　　　　　　[వెల రు 0-1-0.

శివ వేంకటీయ గ్రంథమాల. పంచమపుష్పం.

# పామఱ్ఱు (స్తూప) జయధ్వజ చరిత్ర.

ఇది

1913 సం॥ 12 డిశంబరు తేదీని జరిగిన ఢిల్లీపట్టాభిషేక స్మరణచిహ్న
తృతీయవర్ష వర్ధంతిమహోత్సవసమయమందు
శ్రీమత్పంచమజార్జిచక్రవర్తివిజయడిండిమ
మై వెలువడునటుల

అడవి సాంబశివరావు
నండూరి వేంకటసుబ్బారావు
అను
శివ వేంకటకవులచే

విరచింపఁబడి

పామఱ్ఱు కారొనేషన్ కమిటీవారిచేఁ
బ్రచురింపఁబడియె.

---

బెజవాడ వాణీముద్రాక్షరశాలయందు
బి. కే. స్వామిచే
ముద్రింపఁబడినది.

మొదటికూర్పు 500 ప్రతులు.

1914.



# పీఠిక.

శ్రీమదనంతాఖ్యాన్వర్థకావనీచక్రంబునం గల సకల మానవజాతులకుం బితృ మాతృ దేవ భూధవభక్తిపూజలలో రాజభక్తియే ప్రప్రథమగణ్యంబై, సంతతాచరణీయంబై, నితాంతానందదాయకంబై, యనంతఫలసౌఖ్యప్రదంబై, యాజన్మాంతరక్షణకృత్యంబై యొప్పారుచుండె. తత్కారణం బేమన! జననీజనకులు బాల్యావస్థాంతముదనుక నే ప్రోదిసేయుదురు; పిమ్మట మరణాంతమువఱకు భూనేతయే పోషింపవలసియున్నది. అనిర్వాచ్యస్వరూపుండగు దేవుండు మనల కఖిలసౌఖ్యంబు లొడఁగూర్చు నింద్రియావయవంబులను, సర్వవస్తుసముదాయంబులను దయాదృష్టితో సృష్టించియున్నను భూభృద్రక్షితులము గాకున్నచోఁ బ్రయోజనంబులం గననేరము. పూర్వపురాణదృష్టాంతంబులేగాని ప్రస్తుతము ప్రత్యక్షముగా నీశ్వరుండు మనకు వరంబులొసంగుట కలలోనివార్తలని లోకజ్ఞానులకు వేఱుగాఁ జెప్పనక్కఱలేదుగదా. ప్రాచీనార్యులు గూడ "నావిష్ణుః పృథివీపతి" అని దైవస్వరూపుడు భూలోకమున భూపతియేయనివక్కాణించియుండిరి. గావున రాజభక్తి ప్రతిమానవునకు సంపత్కారంబని నిశ్చయార్థం బిడుచున్నది.

శ్రీమత్పంచమజార్జిచక్రవర్తికిని, మేరీచక్రవర్తినికిని ఆ 1911 సం॥రము డిశంబరు 12వ దినమున ఢిల్లీలోఁ బట్టాభిషేకంబయినదని యెల్లరకుం దెలిసినవిషయమేగదా. ఆనంద

ర్భమునఁ దదీయజ్ఞాపకార్థంబై మా పామఱ్ఱుగ్రామంబున శ్రీ డిప్యూటీతహశ్శీలుదారుగు మహామ్మదు హుమాయూన్ సాహేబుగారి ప్రోత్సాహంబుచే నొక శిలా స్తంభంబు ప్రతిష్ఠింపఁబడియె. ఆ మహామహుని రాజభక్తిని, రాజభక్తి ప్రపూర్ణామృతవచనబోధావిర్భూత కార్యసాఫల్యమును వెల్లడించు కవిశిఖామణులు మాయూర లేనందున నేఁటి కాకొ అంత బ్రహ్మశ్రీ శివవేంకటకవులచే నివారింపంబడినది. ప్రయాసమని యెన్నక మాకోర్కె నీడేర్చి వందనీయులయిన యేతత్కవుల కనేకవందనంబు లాచరించుచు, వారి చరిత్రము నించుక దెల్పి కృతజ్ఞతాసూచకుల మగుచున్నారము.

(1) ఈ కవులలో మొదటివారు బ్రహ్మశ్రీ అడవి సాంబశివరావుపంతులుగారు. వీరి నివాసము కైకలూరుతాలూకా బొమ్మినంపాడు. ఆంధ్రమత్స్యపురాణ బిల్వనాథీయ సాత్రాజితీయ ప్రముఖోద్గ్రంథముల నిరువదైదు రచించిరి. నియోగి బ్రాహ్మణులు. సాంఖ్యాయనసగోత్రీకులు.

(2) రెండవవారు మధ్వశ్రీ నందగిరి వేంకటప్పారావుపంతులుగారు. గుడివాడతాలూకా అంగలూరునివాసులు. మధ్వబ్రాహ్మణులు. విశ్వామిత్రసగోత్రీకులు. శ్రీమద్రామాయణాద్భుతోత్తరకాండ, శుద్ధాంధ్ర భీమసేనవిజయాది పంచవింశతి గ్రంథకర్తలు. పదాఱేండ్లప్రాయంబుననే యష్టావధాన మొనర్చిన మేధావంతులు. వ్యయప్రయాసలకోర్చి తమ నివాసగ్రామంబున బాలికాపాఠశాల స్థాపించి యత్యున్నతస్థితికిఁ దెచ్చిన మహోదారులు. స్వార్థత్యాగులు.

(3) వీరిరువురు చిరకాల స్నేహితులు. సమవయస్కులు. (సుమా రేబదేండ్ల వయస్సుగలవారలు) సమగోత్రీకులు. సహజపాండిత్యులు. ఉభయభాషాకోవిదులు, గానఁ దమ మిత్రత్వమును సార్థకపరచుకొనుటకై తమ హృదయమ్ముల కుం బలెనే తమ నామంబులకుంగూడ మిత్రత్వముం గలుగఁ జేసి "శివవేంకటకవులను" మిశ్రమనామము ధరించి 1912సం॥ రము మొదలు, కనకదుర్గాస్తోత్రరత్నమాల, బ్రహ్మపత్రాభ్యుదయము, జగన్నాథీయాది షట్కుసుమంబులచే శివవేంకటీయ గ్రంథమాలనలంకరించిరి. ఈమధ్య శ్రీవడాలి జగన్నాథ దేవస్థానపరిపాలకులచే "ప్రబంధకవిపంచానన" మను బిరుదము నందినట్లు తెలియుచున్నది. కవితాకన్యక వీరియభీష్టముల సంతతం బిచ్చుచుండుఁగాక.

ఇట్లు బుధవిధేయుఁడు,

పామఱ్ఱు,
15—5—1914.

B. NAGIREDDI.
కాలక్షేపక కమిటి మెంబరు,
పామఱ్ఱు, కృష్ణాజిల్లా.



శ్రీరస్తు.

# పామఱ్ఱు జయధ్వజ చరిత్ర.

శా. శ్రీవిద్యోతసమస్తలోకపటలీ
సృష్టిస్థితిక్షేపణ
ప్రావీణ్యోల్లసదాత్మశక్తిమహిమో
పన్యస్తసర్వేశ్వర
త్వావిఖ్యాతదయామయాకృతియుతుం
డై సర్వగుం డౌమహా
దేవుం డీయుత జార్జిభూమిపతికిఁ
దీర్ఘాయురారోగ్యముల్.

మ. చిరకారుణ్యముతోడ హైందవజన
క్షేమార్థియై హాస్తినా
పురసింహాసన మెక్కి భారతమహీ
భూయిష్ఠతేజోమహ
త్తరఁ గావించినజార్జిభూపతిజయ
స్తంభంబు పామఱ్ఱిలో
స్థిర మై యారవితారకంబుగను ద
చ్చిహ్నంబుగా నొప్పుతన్.

క. భూషణ మై పామర్తికి
శేషుఁడు ధర మోచి యుల్ల • సిలునంతకు సం
తోషమున జార్జికారో
నేషన్ కమిటీ దృఢముగ • నెగడెడుఁ గాతన్.

## పామఱ్ఱు జయ స్తంభము.

క్రీ-శ1911సం॥రండి12డిశంబరు తేదీకి హిందూదేశమునకు సుమారు రెండువందలసంవత్సరములనుండి కలుగఁ జాలనిమహైశ్వర్యము, మహాగౌరవము లభ్య మైనది. కావున అనుదినము సువర్ణాక్షరములతో వ్రాసి యుంపఁ దగినమహాధనము. ఆసుదినము రాజభక్తిపూరితు లగుహైందవులకుఁ దరతరములను జ్ఞాపకమునం దుంచుకొని, పూజింప వలసినట్టి దివ్యధనము. భారతీయులమనంబుల రాజదర్శనము లేక చిరకాలమునుండి నాటుకొనినయజ్ఞానాంధకారంబు దూరంబు సేయుటకు లభ్య మైనవిమలజ్ఞానాంజనము. ఆమహాసుదినము తరతరములవరకు జ్ఞాపక ముండునటుల భరతవర్షంబున నెల్లెడల వివిధోపాయంబుల స్తూప, మందిర, పాఠశాలాదిచిహ్నంబులు నెలకొలుపఁబడినవి. ఇందు "స్తూప" మనునామాంతరము గల జయస్తంభమును బ్రతిష్ఠించుట, ఆ స్తంభము చలనము లేక ఆచంద్రతారకముగ నిలిచి, యనుదినము ప్రజల కీసుదినము జ్ఞాపకము సేయు చుంట కే; గాన నుత్తమసాధన మగుటకు సందియము లేదు. పామఱ్ఱుగ్రామమున నట్టిజయస్తంభ మాసుదినమున స్థాపింపఁబడినది. పూర్వకాలమున మహాకీర్తిప్రతిష్ఠలు గాంచినసర్వంసహాపతులు తమపరిపాలనజ్ఞాపకము ల

యినజయ స్తంభములు ప్రతిష్ఠించువాడుక కలదు. ఇటలీలోఁ గొన్ని జయ స్తంభములు కలవు. మహాఅలగ్జాండరు, నెపోలి యను మొదలగు మహాజయశీలురు తమజయములను దెలుపు జయ స్తంభములను నాటిరి. హిందూ దేశమునందును ఈ ఆచారము సంప్రదాయసిద్ధముగా వచ్చు చుండినది. కుతుబుమైనారు ఇట్టి జయ స్తంభమే. హస్తినాపురమున మహమ్మదీయ ప్రభువులు నాటినజయ స్తంభములు గలవు. సింహాచల ప్రాంతమున శ్రీకృష్ణదేవరాయలువారు జయ స్తంభమును నాటిరి. లెక్కింపఁ దలఁచిన నిట్టిజయ స్తంభము లక్కడక్కడ పెక్కులు గలవు. మనపామఱ్ఱులో నిలిపిన శ్రీపంచమజార్జిజయ స్తంభము ను నట్టిదే. ఇట్టిజగద్విఖ్యాతజయ స్తంభస్థాపనాధికరణం బగు పామఱ్ఱుచరిత్ర మించుక యిచట ముచ్చటింప వలసి యున్నది.

కం. పాము వసియించుమఱ్ఱికి
గ్రామము కుఅఁగఁటను గలుగఁ ♦ గాఁ గాంచిజన
స్తోమమ్ము "పాముమఱ్ఱనఁ"
బామఱ్ఱనియుదియ పిదప ♦ వాడుక పడియెన్.

ఈపామఱ్ఱునకు సమీపమునఁ బూర్వకాలమునందు "నాగులేరు" అనుచిన్ననది ప్రవహించు చుండెడిది. ఆనదికి సమీపమున నొకతమ్మికొలనును, దన్మధ్యమున దివ్యప్రతిష్ఠితం బగు నొకశివలింగమును గలవు. ఆకొల నెల్లకాలము నేనుఁగులోఁతునీరు కలిగి యుండెడిది. దానినడుమ నుండినలింగమును ఆ యేటిని మించి పైకిఁ గనఁబడు చుండెడిది. ఆలింగముయొక్క పాను (పీఠము) ఎంతఁలోతున నుండెడిదో తెలియ రా కుండెను.

ఆశివలింగమును బూర్వకాలమున నాగులు ప్రతిష్ఠించి రని యు, దదభిషేకతీర్థముకొఱకే తత్సమీపమున కొకచిన్నినదిని దెచ్చిరనియు, నాగులు తెచ్చినది గనుకనే దానికి "నాగులేరు" రనునామము కలిగె ననియుఁ జరిత్రాంశమైనవృద్ధసంవాదము కలదు. ఆశివలింగమును నిరాభరణమై, జలమధ్యగతమై, మహాప్రభావకలితమై, దివ్యపూజితమై యుండెనఁట. ఆలింగము శిరంబున నొకపద్మ ముద్భవించి యెల్లవేళల వికసించి మనోహారపరిమళంబు వెదజల్లు చుండునఁట. ఆకొలను గట్టున శాఖాశిఖాగ్రచుంబితదిగంత మగునొకమహావటవృక్షంబు వర్ధిల్లు చుండెను. ఆవృక్షకోటరంబున నొకమహానాగంబు నివసించి ప్రత్యహంబును నాశంభులింగమునకుఁ జుట్టుకొని నాగాభరణాలంకారమై యుండునఁట. ఇట్లు చిరకాలము నడువఁ గ్రమంబున నాచెరువు కొంతపూడి తన్నికటమున నొకగ్రామంబు నిర్మింపఁబడియె. అంతఁ గొంతకాలమునకు మహమ్మదీయప్రభుత్వము వచ్చి, హిందూదేవాలయము లున్మూలించి, మూలవిగ్రహంబులపీఠంబులందు నిక్షేపింపఁబడినధనరాసులఁ గొల్లఁగొనుట తటస్థమయ్యె. ఆమహాసంక్షోభకాలమున నొకమహమ్మదీయసేన యీగ్రామమార్గమునఁ బోవుచు నీలింగము మహాప్రభావసంపన్న మనియు, నద్భుతాకారకలిత మనియు, హిందూజనులచే నతిభక్తిశ్రద్ధలఁ బూజింపఁబడు చున్న దనియు విని, దీని నున్మూలించినచో దీనిక్రిందఁ బెక్కుద్రొక్కము సిక్కఁ గల దని తలంచి, యందునకుఁ గడంగి, తటాకముఁ జొచ్చి లింగమును బెరుకుటకు మనుష్యసాధ్యము గా నంతలోఁతు గలనీ రందుండుటచే సామజంబుం బురికొలిపి దాని ను

న్మూలింపఁ జొచ్చిరి. అగ్రజంబు తనకు సహజం బగుపద్మనాళోన్మూలనాభిలాషచే లింగశీర్షవిరాజమానం బగుకమలంబు గ్రహించి లాగఁ జొచ్చినఁ గరికరాకృష్యమాణం బై లింగమూర్ధగతసరోజంబు మూరెఁడుపొడుగునాళంబుతోఁ బెకలివచ్చినఁ దద్వివరంబునుండి శోణితప్రవాహంబు పెల్లుబ్బి కొల నెల్లఁ గప్పి, లోహితద్యుతుల మప్పి, యందలి జలంబులకుఁ గీలాలనామంబు సార్థకంబు గావించె. ఆ యద్భుతం బగువిశేషంబు గాంచి భయాకులంబులై యుల్లంబులు తల్లడిల్ల నాక్షుల్లకులు కనుకనిం బరచిరి. లింగశిరోగ్రంబునుండి యున్మూలితం బైనపద్మనాళంబు వెడలినప్రదేశంబున నిప్పటికిని మూరెఁడులోఁతున గుంటపడి కనుపించుచున్నది. ఇప్పటికిని ఆ గుంటలో ప్రతిదినమును నీళ్ళుపోసి కడిగి వస్త్రఖండముచేఁ జక్కఁగాఁ దడి యొత్తుకున్న నందుఁ బూతిగంధము వెడలుచున్నది. ఇది నేఁటికిని ప్రత్యక్షాంశముగ నున్నది. ఇది యీశ్వరమహిమ కాక వే రేమని చెప్పవచ్చును! నవనాగరికులిట్టిసంగతులు కట్టుకథ లని, యసత్యము లని వాదింప వచ్చెదరని మే మెఱుఁగుదుము; కాని సత్య మగుకథ చెప్పక, వారికి వెఱచి మఱుగుపరచు టుచితము కాదు గదా! అయినను ఈశ్వరమహిమ లద్భుతములు. నవనాగరికులవాదములకీశ్వరుఁడే సమాధాన మియ్య వలయుఁ గాని మనతరము కాదు. ఈ విశేషము ప్రత్యక్షముగఁ గనియు, వినియు, దద్గ్రామీణు లాలింగమునకు నిత్యపూజోపచారములు భక్తిపారీణులై జరుపుచుండిరి. కాలక్రమమున నక్కొలను పూడి, తత్పరిసరంబున గ్రామము వృద్ధి కాఁ జొచ్చినంతట, ఆలింగ మున్నస్థలము బై

టపడినందున నప్పటిభక్తాగ్రేసరు లాలింగమున కాలయమంటప ప్రాకారాదులు కట్టించి "సోమేశ్వరస్వామి" యనినామం బిడి, నిత్యోత్సవాదులు యధావిధిగ నొనర్పఁ జొచ్చిరి. ఆ కొలని గట్టున నుండినమఱ్ఱిచెట్టు ఇప్పు డదృశ్య మైనది; కాని ఆకాల మునఁ జెట్టును, దానితొఱటలోఁ బామును నుండుట సత్యమే అయినందున దానికెలంకుల నున్నగ్రామమునకు "పాముమఱ్ఱి" యని పేరు లభించినది. "పాము" "మఱ్ఱి" అనుపదంబులఁ గల మకారద్వయము అల్పప్రాణసవర్ణాక్షరము లగుటచే మిశ్ర భావమొంది "పామ్మఱ్ఱి" అనఁబడెను. వాడుకలో ద్విత్వము తేలి, "పామఱ్ఱి" అనియు, తుదిరేఫముమీఁది ఇత్వ ముత్వమై "పామఱ్ఱు" అని వాడుకపేరై నేఁటికి నట్లే పిలువఁబడు చున్న ది. కొందరు శ్రోత్రియప్రాయులు ప్రథమాక్షరమునకుఁ, గ్రారవడిం జేర్చి, "ప్రామఱ్ఱు" అందురు; గాని అది సాధువు కాదు. ఉత్పత్తి ననుసరించి జనసామాన్యమునకు వాడుకలో నుండు "పామఱ్ఱు" అనుపేరే సాధువు గాన మే మీ చరిత్ర యం దాపేరునే వాడెదము. ఇది పామఱ్ఱుగ్రామమునకు సంబంధించిన పూర్వగాథ.

ఇప్పు డీగ్రామము చుట్టుపట్టులఁ గలగ్రామములందు గళగ్రామమై, గుడివాడతాలూకాయందు "డివిజన్"అనునంత ర్భాగమునకు నాధారమై యున్నది. ఈ "డివిజన్"కు సంబం ధించి 65-గ్రామము లున్నవి. డివిజన్ పరిపాలకుఁ డగు డిప్యూటీతహశ్శీలుదారుకార్యస్థాన మీగ్రామమందు గలదు. 1910సంవత్సరంలో తాలూకాలువిభాగించినప్పు డీ"పామఱ్ఱు" డివిజన్ గాఁ జేయఁబడినది. ప్రథమమం దిచ్చటికి మ.రాం.రా.

నందూరి రామచంద్రరావుపంతులుగారు డిప్యూటితహశ్శీలు దారుగా 1-11-1910 తేదినవిచ్చేసి ప్రజలను దనకన్నప్రజల వలె భావించి న్యాయముగను నెమ్మదిగను బరిపాలించి సర్వజనులచే మెప్పువడసిరి. కొలఁదికాలములోనే మ.రా.రా. మహమ్మదు హుమాయూన్ సాహెబుగా రాస్థాన మలంకరించిరి. ఇక్కాలమే మనప్రస్తుతచరిత్రనాటకమునకు నాంది. వీరి పరిపాలనోజ్జృంభణకాలమునందే శ్రీ శ్రీ పంచమజార్జిచక్రవర్తిగారు ఢిల్లీనగరంబునఁ బట్టాభిషేకమహోత్సవము నంగీకరించినశుభదినము వచ్చినది. ద్విశతాబ్దములనుండి హిందూదేశమున కలభ్యమైనరాజసందర్శనమహోత్సవమున కీదేశము పరిపూర్ణరాజదర్శనమహోత్సవమునం బొంగి పెంపునం బొంపిరివోవురత్నాకరంబు ననుకరించి యెచ్చోటఁ జూచినఁ బెచ్చుపెరుగుమహోత్సవములతో నుల్లసిలు చుండె. అమ్మహోత్సవ మిచటను శోభాయమానముగ జరుప నెంచి తదుత్సాహపూరితు లగుమహాజనులవలన "5 వేలరూప్యంబులు సమకూర్పఁబడి నాఁటిదినము శ్రీమచ్చక్రవర్తి, చక్రవర్తినీల యూరేగింపుమహోత్సవము మహావైభవముతో నెరవేర్పఁబడి ఆసందర్భమున సంఖ్యాతీతు లగుబీదలకు అన్నదానము సేయఁబడినది. తన్మహోత్సవజ్ఞాపకార్థ మిచ్చట "జయస్తంభము" ప్రతిష్ఠింపఁబడినది. ఇదిఇచ్చట ఆచంద్రతారార్కము స్థిరముగ నెలకొని ప్రజల కపూర్వభాగ్యనిదానం బగు నమ్మహాసుదినము సర్వదా జ్ఞాపకముచేయు చున్నది. ఈ స్తంభ మీగ్రామముమధ్యనుండి బందరుహైదరాబాదురోడ్డు యొక్క 15వమైలులో 5-6 ఫర్లాంగురాళ్ళమధ్య (ననగాఅరవఫ

ర్లాంగులో) పుల్లేరుకాలువయొక్క వంతెనప్రక్క ప్రతిష్ఠింపఁబడినది. ఇది14½అడుగులఎత్తుగలిగి, ఎన్నఁటికిని గదల కుండునట్లు 6అడుగులలోఁతునఁ బాఁతఁబడి, నడుమున నాలుగుపలకలుగను, దానికిఁ గ్రిందను మీఁదను ఎనిమిదిపలకలుగను మలఁపఁబడి, చివర వట్రువుగాఁ జేయఁబడి యున్నది. దీనిమధ్యపలకలలోఁ దూర్పువైపుపలకమీఁద "శ్రీ శ్రీ పంచమజార్జిచక్రవర్తి శ్రీ మేరీచక్రవర్తినీగార్లకు ఢిల్లీ నగరమందు 12-12-1911 తేదిని పట్టాభిషేకమహోత్సవము జరిగిన దని జ్ఞాపకార్థ మీ స్తంభంబు ప్రతిష్ఠింపఁబడి,14-12-1911 తేదీని, కృష్ణాకలెక్టరు, హెచ్.ఎల్.బ్రైడ్వూడ్ దొరగారివలనఁ బ్రసిద్ధపరుపఁబడినది" అనుఅర్థ మిచ్చునట్టుల ఆంగ్లేయభాషలో

IN COMMEMORATION

OF THE

IMPERIAL CORONATION

**ON 12-12-1911 AT DELHI**

OF THEIR MOST

GRACIOUS MAJESTIES

**KING-EMPEROR GEORGE V**

**AND**

**QUEEN-EMPRESS MARY.**

***UNVEILED ON 14-12-1911***

**By H. L. BRAIDWOOD Esq.,**

Collector, Kistna.

అని లిఖింపఁబడి యున్నది. ఇట్టియనశ్వరమహాకార్యనిర్మాణమునకీ ప్రతిష్ఠాపనమే ఈతాలూకాకుఁ బ్రప్రథమము. ఈమహాకార్యము సంఘటించుటయందు శ్రీమహమ్మద్ హుమాయూన్ సాహెబుగారు చూపినశ్రద్ధ, ప్రోత్సాహము, కార్యనిర్వహణదీక్ష, అత్యంతశ్లాఘాపాత్రము లనుటకు లేశమును సందేహము లేదు. కావున నీసందర్భమునందు ఆమహాపురుషుని నించుకంత ప్రశంసింపక విడుచుట మాకు ధర్మము కాదు. సత్పురుషు లెరికిని వందనీయులే కదా?

హుమాయూన్ పంచరత్నావళి.

మ. పరమోత్సాహముతోడ హైందవజన
 ప్రాంచన్మనోభీష్టముల్
చరితార్థంబు లొనర్పఁ బంచమమహా
 జార్జిప్రభుం డంచితా
దరుఁడై ఢిల్లి మహాభిషేకపదవిన్
 దాల్పంగఁ దన్మంగళా
కర మాపుణ్యదినంబు శాశ్వతముగాఁ
 గన్ దెల్పఁ బామర్తిలో
స్థిర మా స్తంభము నాటె, మాకుఁ గర మ
 ర్థిన్ మేలు గావించి తీ
వ్రు తేజోనిధివై మహమ్మదుహుమా
 యూన్ సాహెబుగ్రామణీ ||

మ. చిరకష్టంబుల కోర్చి రాజ్యపదవీ
 స్థేమంబుఁ బాటించి యీ

భరతవర్షంబున్ మొగలాయిరాజ్యరమ సం
భావించె ము న్నే మహా
పురుషుం డాతనిపేరు నీకె తగుఁ బెం
పుం దెంపు సొం పొంద స్వా
ర్థరతిన్ గైకొన కెల్లకాలము మహా
ధర్మానుకంపానిరం
తరచిత్తంబున సంచరించుచు మహా
ధన్యత్వముం గాంచితీ
వురు తేజోనిధివై మహమ్మదుహబూ
యూన్ సాహెబుగ్రామణీ ॥
మ. ధరణిన్ జన్మము దాల్చినందులకు స
త్యస్థేమమున్ సత్కృపా
పరిణామంబు పరోపకారనిరతిన్
బాటించు టెన్నన్ మహా
పురుషాంకంబు లటంచు నీచరితమే
బోధించు వేనోళ్ళ నే
కరణిన్ ని న్ననువర్తనీయచరితున్
గాఁ బ్రస్తుతిం జేయ రి
ద్ధర ధన్యాత్ములు ని న్నెరింగిన భవ
త్కార్యంబులన్ గన్న న
త్యురు తేజోవిభవా! మహమ్మదుహబూ
యూన్ సాహెబుగ్రామణీ ॥
మ. స్థిరమై మించినదైవభక్తి యెడఁదన్
జెన్నారఁగా దానితో

సరిగా మెప్పినరాజభక్తియును నై
శ్చల్యంబునన్ నీయెడన్
గర మొప్పారెడు నీమనోద్రఢిమ యె
క్కాలంబునన్ గన్న ని
ర్భరలోకాపకృతిప్రవీణ మగుచున్
బాటిల్లు నీయట్టిస
త్పురుషున్ బాలకుఁ గాఁగఁ గాంచినప్రజల్
పుణ్యాత్మకు ల్గారె య
త్యురుతేజోవిభవా! మహామ్మదుహుమా
యూన్ సాహెబుగ్రామణీ ॥

మ. మరి నీపల్కులు విన్నధన్యుఁడు సుధా
మాధుర్య మి ట్లంచుఁ దా
నెరుగున్ నిన్నొకసారిఁ గన్నసుజనుం
డిష్టార్థసంపత్తి ని
ర్భరుఁ డౌనీపరిపాలనం బవనివా
రల్ రామరాజ్యంబువై
ఖరియొల్లన్ జవి చూతు రిట్టినిను దీ
ర్ఘప్రాభవారోగ్యసు
స్థిరసంపద్యుతుఁ జేసి బ్రోచుతఁ గృపా
దృష్టిన్ జగన్నాథుఁడ
త్యురుతేజోవిభవా! మహామ్మదుహుమా
యూన్ సాహెబుగ్రామణీ ॥

ప్రజలమనోలవాలంబుల నంకురించినరాజభక్తి మహా
దుహుమాయూన్ సాహెబుగారి వాఙ్మాధుర్యరసపేకము

చేఁ బ్రోదియై, పెరిగి, సత్ఫలదాయకమై, ఇంతటిమహాకార్య మొనర్చుటకు వలయుద్రవ్య మవలీల సేకరింపఁ జేయుటయే గాక, ఈప్రతిష్ఠాపన మనునత్సరముచు దన్మహోత్సవసూచకంబుగఁ దత్సుదినంబున బీదల కన్నదానము సేయుట మొదలగుసత్కార్యాచరణమునకుఁగాను "కారోనేషన్ కమిటీ"అను పేర నీగ్రామమున శాశ్వతసమాజ మొకటి స్థాపింపఁ జేసినది.

ఈకమిటీకి అప్పటప్పటి కిడివిజన్‌కు పాలకుఁడుగా నుండుడిప్యూటితహశ్శిలుదారుగారు ప్రసిడెంటుగను, మద్దిపట్లశెక్షన్ D. P. W. సెక్షన్ ఆఫీసరుగారు (సెక్రటరీ) కార్యదర్శిగను, పామర్రి గ్రామమునసఫు (టెజరర్) కోశాధికారిగను ప్రామర్రి సెక్షన్‌కు D. P. W. సెక్షన్ ఆఫీసరుగను, మేడూరుపరగణా ఠాణేదారుగను, అప్పటప్పటికి వచ్చువారింద (మెంబర్లు) సభికులుగను, తుర్లపాటి వేంకటహనుమంతరావు, ఈ సుందరరామయ్య, యూనియన్ చైర్మన్, చిర్రావూరి కామేశ్వరరావు, మహమ్మదు యూసఫ్‌సాహెబు, డాక్టరు ఖాజాఅసదుల్లాసాహెబు, బొమ్మారెడ్డి పిచ్చిరెడ్డి, బొమ్మారెడ్డి కోటిరెడ్డిగార్లు స్థిర మైన (మెంబర్లు) సభికులుగను ఏర్పాటుకాఁబడిరి. ఈసమాజము 12-11-1911 తేదీనే స్థాపింపఁబడి అప్పుడు ఉత్సవార్థము పోగు చేయఁబడినసొమ్ములో అప్పటి అన్ని ఖర్చులుపోఁగా మిగిలినరు556లును దీనికి శాశ్వతమూలధనముగ నియ్యఁబడినది. ఈమూలధనమును సేవింగ్సుబ్యాంకీలోఁగాని, సెక్యూరిటిబాండుమీఁదఁ గాని ఉంచివృద్ధిలోనికిఁ దెచ్చుచు దీనిమీఁద వచ్చెడువడ్డీవలనను, అనుకూల్యమునుపట్టి వసూలు చేయుచందాలధనమువలనను ప్రతి సంవత్సరం 12వ

డిశంబరు తారీఖున శ్రీరాజచక్రవర్తిగారి ఢిల్లీపట్టాభిషేకస్మరణచిహ్నముగ బీదలకు అన్నవస్త్రదానము చేయుచుండుట కుద్దేశింపఁబడినది. ఈసభవారియుద్దేశ మెంతయు శ్లాఘాపాత్రము. హిందూదేశ మందేమి, ఇతరదేశములందేమి పెక్కండ్రు భూమిపాలురు, తత్స్మరణచిహ్నములుగాఁ బ్రజలు పెక్కు జయస్తంభములనుఁ బ్రతిష్ఠించిరి గాని, ఇట్టిసమాజము లేర్పడి ప్రతివత్సరమును లోకోపకారార్థ మన్నవస్త్రదానములు చేయు చుండు కట్టుపాటు లెచ్చటను లేవని చెప్పవచ్చును. ఇట్టిమహాకార్యకరణమున కీపామఱ్ఱు కారొనేషన్ కమిటీయే ప్రథమ మని తెలియ వచ్చు చున్నది. కాన నీ సమాజోద్దేశములను నిర్విఘ్నముగ కొనసాగించుచు, దీనివలనఁ బ్రజల కెడ తెగని రాజభక్తి హృదయంబులఁ గుదురు పరుచుటకు సర్వలోకేశ్వరుం డనుగ్రహించును గాత.

సీ. అసమానరాజభ • క్తిసమేతులై ప్రజా
సామాన్యమునకు రా • జన్యభక్తి
స్థిరముగ నెలకొల్పి • పరమోపకారంబు
గావించుశ్లాఘ్యసం • కల్ప మొప్పఁ
బ్రతిసమంబును రాజ • పట్టాభిషేక మ
హోత్సవస్మరణ ప్ర • యోగసరణి
నతిబీద లగువారి • కన్నవస్త్రము లిచ్చి
తత్సుకృతంబు భూ • ధవున కంచి
గీ. తాయురారోగ్యము లొసంగు • నట్లు వేఁడి
కొనెడు సత్కార్యశూరులై • మనెడునట్టి

సాధుపామర్తి కారొనే • షన్ సమాజ
సభికులను బ్రోచుఁగాన్పుతఁ • జక్రధరుఁడు.

ఈకారొనేషన్ కమిటీ ద్వితీయసంవత్సరోత్సవము 1912 సం॥ 12 డిశంబరు తేదీని, అప్పటి డిప్యూటీ తహశ్శీలుదారుగా రగు మ. రా. రా. తాయి సుబ్బారావునాయుఁడుగారి యాజమాన్యముక్రింద జరుపఁబడినది. రాజభక్తి విషయమున మహమ్మద్ హుమాయూన్ సాహేబుగారి కేవిధమునఁ దీసిపోని సుబ్బారావునాయుఁడుగారి ప్రోత్సాహప్రయత్నములచే(రు100) నూరు రూప్యము లధికముగఁ జందాలు పోగు చేయఁబడి వేయిమంది బీదలకు అన్నవస్త్రదానము జయప్రదముగఁ జేయఁబడినది.

సీ. తతరాజభక్తి ప్ర • ధానుఁడై రాజన్వ
తియగు భారతవర్ష • దిష్టసూచ
నార్థతదీయ ప • ట్టాభిషేకస్మర
ణాంకానువర్షోత్స • వావసరము
నందు నృపాలున • కభ్యుదయముఁ గోరి
ప్రజలలోపల రాజ • భక్తి నిలిపి
యతిబీద లగువారి • కన్నదానము చేసి
దీపితాత్మీయ ప • రోపకార
గీ. కలనము కృపావిశేషంబు • దెలిపినట్టి
ధన్యగుణరాశియై మించు • తాయి సుబ్బ
రావునాయని నధికదీ • ర్ఘాయు వొసఁగి
ఈశ్వరుం డెల్లయెడల ర • క్షించుఁ గాత.

ఈ 1913 సం॥ రం॥ 12 డిశంబరు తారీఖున పట్టాభిషేక స్మరణ చిహ్న తృతీయసాంవత్సరికోత్సవము ప్రస్తుతపు డిప్యూటీ తహశ్శీలుదారు మ. రా. రా. వక్కలంక లక్ష్మీనరసింహారావు పంతులుగారి పరిపాలనక్రింద నత్యంత శ్లాఘాపాత్రముగ నెరవేరినది. అన్నదానముచే సంతృప్తు లగుబీదజనులు హర్షోత్కర్షాయత్తులై యీ మహాత్ముని గూర్చి చేయు ధన్యవాదనంబులు, జయజయారావంబులు దిగంతములు బధిరీకృతములుగావించె నని చెప్పిన నది యతిశయోక్తి కానేరదు. నిరతాన్నప్రదానజాయమానవిశదయశోముక్తావితాన సమలంకరిష్ణుసకలహరిదంతరావకాశం బగుసద్వంశంబున నుద్భవించిన ముక్తామణి యగునీమహనీయునివితరణగుణ మిట్టిదని వర్ణించి చెప్పుటకంటె ననవరతసమాశ్రిత సకలాభీష్టప్రవర్షణోత్కర్షం బనరుమందారతరుపంచకం బీఘనుని దక్షిణకరాంగుళిపంచకమై యవతరించెనని చెప్పుట స్వభావోక్తి గాని వేరు కానేరదు. ఈ సుగుణాభరణుని ప్రోత్సాహమే మ మ్మీచరిత్రగ్రంథరచనమునకును బురికొలిపినది. కావునసీమహనీయుని నించుక ప్రశంసించి విరమించెదము.

సీ. భారతీలీలావి ◆ హారభాజనకలా
విక చప్రసూనవా ◆ టిక యనంగ
నవరసాలంకార ◆ కవితారసాపూర
కలశాంబునిధితరం ◆ గం బనంగ
గిరుబంతనిహితత్వా ◆ గధ్వజాయితవితీ
ర్ణాతర్వితార్థిగ ◆ ణం బనంగ

బహురాజకార్యని ◆ ర్వహణ నైపుణ్యాసం
చితకీర్తి మల్లికా ◆ లత యనంగఁ
గీ. దసరు భవదన్వవాయంబు ◆ ఘనత కీవు
నిక్కముగ ఫలరూపమై ◆ నెగడితయ్యా
భవ్యగుణసంపదకలంక ◆ వక్కలంక
లక్ష్మినరసింహరాయ క ◆ ళానికాయ.

చ. నిజముగ రాజభక్తికిని
నీవె నిదానమవై దృఢంబుగాఁ
బ్రజలకు నేర్పఁ జొచ్చితివి
భద్రగుణంబుల కీవె యిక్కవై
ఋజుత జనాళియం దలవ
రించితి వే మని సన్నుతింతు నీ
సుజనత వక్కలంక కుల
శోభిత లక్ష్మినృసింహ పండితా.

మ. కరుణన్ బీదల కన్నవస్త్రము లొసం
గన్ నీమహోత్సాహని
ర్భరతన్ గన్గొని లేమి లేమియగుచున్
వైధాత్ర సంకల్పమున్
జరితార్థం బొనరించు నీదగు క్రియా
చాతుర్యమార్యాళి ప
ల్మరువర్ణించును వక్కలంకకులజా
లక్ష్మినృసింహాహ్వయా.

## రూపకం - బ్యాండుమెట్టు .

౧. జార్జిచక్రవర్తికిన్ ♦ జననిమేరిరాణికిన్
ఊర్జితజయమంగళంబు ♦ లొసఁగునీశుఁ డెప్పుడున్.

౨. ఢిల్లిసింహాపీఠిపై ♦ నెల్లకాలముండుచున్
చల్లగ శిరులొందుచు వ ♦ ర్ధిల్లు చుంద్రుగావుతన్.

3. ఆచంద్రమార్కమ్ముగా ♦ నలరి నిబ్బరమ్ముగన్
లేచి యశోధ్వజము లవని ♦ వెలయు చుండుఁగావుతన్.

౪. తనదు ప్రజల సాటిఁగాఁ ♦ దలఁచి మనల సూటిఁగా
ఘనుఁడు జార్జిచక్రవర్తి ♦ కాచు చుండుఁ గావుతన్.

క. శివవేంకటీయకృతియై
చవు లిడుపామట్టు స్తంభ ♦ చారిత్రం బీ
భువి నారవితారకమై
కవిహృదయాహ్లాదకరము ♦ గా విలసిల్లున్.

సంపూర్ణము.

## వెలకుదొరకు పుస్తకములపట్టి. అంచెకూలిగాక.

1 శ్రీమద్రామాయణాద్భుతోత్తరకాండము [అపూర్వము పారాయణ యుక్తము రుచిరాలంకారభూయిష్టము 6 ఆశ్వాసములు] రు 1

2 జగన్నాథీయము [వడాలిమాహాత్మ్యము- అపూర్వగ్రంథము] 0

3 శుద్ధాంధ్రమేఘసందేశము } విప్రలంభశృంగారము 0

* 4 ఆంధ్రీకృతమేఘసందేశము 0

* 5 చంద్రిక [నవలాప్రబంధము ప్రతిస్త్రీపురుషుడు చదువదగినది] 0

6 బాలాశతకము [స్త్రీనీతులు] రెండవకూర్పు 0

7 సీతారామశతకము 0

8 రామశతకము } భక్తిరసప్రధానములు 0

9 ఆదికేశవశతకము 0

10 శ్రీశైల హనుమచ్ఛతకము 0

11 బ్రహ్మపురాభ్యుదయము [పాగానుమహిమ] 0

12 కంగిరెడ్డు [హాస్యము] 0

13 స్త్రీవిద్యాసారసంగ్రహము [వచనము] 0

14 దొంగసామిచరిత్ర [నిజమయినకథ] 0

15 శ్రీకృష్ణమానసపూజ 0

16 హరిహరస్తోత్రతారావళి } సంస్కృతము రెండవకూర్పు 0

17 కనకదుర్గాస్తోత్రరత్నమాల 0.

18 అంగలూరు విలేజీభూగోళము 0.

19 పామర్రు జయధ్వజచరిత్ర 0.

20 బాలతోడవు [అమూల్యము] ఉచితముగ నొసగబ

21 నేత్రావధానచంద్రిక 0.

* అచ్చులోనున్నవి.

వలయువారు,

శివవేంకటీయ గ్రంథాలయము,

అంగలూరుపోస్టు, కృష్ణాజిల్లా.

అని వ్రాయవలయును.